లతో చేరి యెందుజూచినను దుర్గంధమైనటువంటి యీ
పనికిమాలిన శరీరమును పోషించుటయును తర్వాత యీ
పాడు ఘటమును విడిచి యితరజీవుల లోద్వాటు చనిపో
వడమున్ను విచారించగా మృగపశుక్రిమి కీటకములతో
సమమనిచెప్పుటకు యేమిన్ని సందేహము లేకున్నది. అట్ల
యిన మనపూర్వులు నరజన్మ శ్రేష్టంబని చెప్పినమాట
ఉత్తదగునా లేదు. యెట్లనగా వ్యాసులు వాల్మీకులు వశి
ష్టులు భరద్వాజులు గౌతములు అత్రిజనకవిభీషణప్రహ్లాద
అంబరీష శుక శౌనక పరిక్షిత్తు ఘట్వాంగద రుక్మాంగద
అర్జన విశ్వామిత్రు అక్రూర అజామిళ శబరి కుచేల భృ
గుడుమృకండు హనుమంతుడు గయుడు సానందుడు
కణ్వ గార్గేయ బలి నారద తుంబురుడు మొదలుగాగల
పూర్వపు మహానుభావులు గాక యిటీవల కలియుగములో
ప్రసిద్ధిజెందిన మహానుభావులు బ్రహ్మంగారు పోతులూ
రయ్య సిద్దయ్య మస్తాను హజరత్తు వీరయ్య పెద్దదాసు
రామదాసు కబీరుదాసు కమాలుదాసు కాళిదాసు చిక్క
య్య శంకరుడు సారంగధరుడు వెంగమ్మగారు వేమన
గారు యీశ్వరమ్మగారు గోవిందమ్మగారు నాసరుగారు
జ్ఞానానందులు సత్యానందులు నిత్యానందులు సదానందులు
సక్కుబాయి మీమాభాయి రామభాయి గోవిందయ్య
గోరాభాయి మొదలుగాగల యిటువంటి మహానుభావులు
యికనెందరో కోట్లకొలది నిత్యానిత్యమును విచారించి
జగవ్యాపకమైన పరమాత్ముని స్వరూపములో ఐకసంధా
నులయి తరుగలేని నిత్యానంద పరిపూర్ణావ్యాగమును

పాపము చేయుచున్నారట. యిన్ని జీవులున్ను మనుష్యులే మోక్షమును జెందిరి. గాని యితర జీవులేవియును మోక్షమును జెందినటుల యిదివరకు గాని యిప్పుడు మనకండ్ల యెదుటగాని చూడనులేదు వినగనులేదు యెవ్వరు చెప్పనులేదు. గాన నరజన్మమే సకల శ్రేష్ఠమని చెప్పుటకు చెల్లినది గనుక నరులు విచారింపవలసిన యేమనగ యొక్కప్పుడు మనము మనకండ్లయెదుట యొక స్త్రీ గర్భమునుండి వొక యొక బాలికయో బాలుడో పుట్టుటను చూచుచున్నాము గదా ఆ బాలుడు యాగర్భములోనికి యెట్లువచ్చెను ఆగర్భము చేరకమునుపు యెచ్చటనుండెను. తల్లిగర్భము చేరినంతనెగా శరీరము వచ్చి రూపమాయె తత్పూర్వము నాటికి రూపమెట్లుండె పోని అట్లైకదా మనము మనతల్లి గర్భములో నుంటిమి. మనము మన తల్లిగర్భమునకు రాకముందెక్కడ నుంటిమి సరే పుట్టితిమి బాల్యమందున యేమియు తెలియక నుండుటేల తర్వాత యౌవనంబున మద కామమోహములచే నిండియుండుటేల కౌమారమున సంసార జలధిలోబడి ద్వంద్వాద్వంద్వములు ఘోరఘోరములు సుఖదుఃఖములు కలిమిలేములు మొదలుగాగల యాశలోపడి యేడ్వనేల వార్ధిక్యమున శరీర అవయవములు బలహీనమై విషయ సౌఖ్యంబులేమియు నందక పరసుఖమింతైన లేక చచ్చెదనేమోయను భయముగలిగి మృత్యువునకు దండము బెట్టుచు యిది కపటనాటకమని తోచక యిట్టి దుష్పరమయి దుఃఖరూపమైనట్టిదియునైన యీ బ్రతుకే కోరుచు యీ శరీరమును విడుచుటకు యిష్టపడక కష్టపడనేల

యిట్టుండగనే కాలపరిమాణము పూర్తియై చనిపోవుదును. యీశరీరము సున్నమో లేక అగ్నిలోనైనను కలిసిపో వును. యీశరీరములో యుండియున్న జీవియెంగు పోయెను. యిట్టిసత్యము తెలిసినవారే మానవులు లేకుం డిన దానవులు యిట్టిసత్యనెరింగినవారే మనుజులు లేకుం డిన మనుజులు యిట్టిజ్ఞానము సహించినవారే నరులు లేకుండిన తిరులు యిట్టిమాయను వర్జించి సాధించిన మహానుభావులకు నిత్యసుఖమట నిత్యానందమట నిత్య మంగళమట యిట్టియోగమును వర్జించలేక తిరిగెడి మూ ఢులకు నిత్యదుఃఖమట నిత్యనరకమట నిత్యవ్యసనమట.

సత్యము. సత్యము. సత్యము.



# గ్రంథపోషకులు.

చిక్లిణేపేట గ్రామం.

కేసుపర్తి ఆదిశేషయ్య
పెనుమల్లి సుబ్బారెడ్డి
,, రామమ్మ
కోవూరు పిచ్చిరెడ్డి
బొందిలి బాలాజీశింగ్
లక్ష్మమ్మ
బెల్లంకొండ బుడ్డపిల్ల

ఇడవలూరు గ్రామము.

పోతిరెడ్డి సుబ్బారెడ్డి

సిద్దీపురం గ్రామం.

వనమా ఆదెమ్మ
దోర్నాల లక్ష్మమ్మ
మంగలపూడి వెంకట్రామిరెడ్డి
మీరియం సుబ్బమ్మ
నందూరు సుబ్బమ్మ
డేగా లక్ష్మమ్మ
నందూరు మహాలక్ష్మమ్మ

మర్రిపాడు గ్రామం.

బద్దిపూడి కనకమ్మ
నాపూరు వెంకమ్మ
సిద్ధవరపు శంకరమ్మ
చెర్లో కమలమ్మ
కాకాణి శీతమ్మ
యిరుపూరు జానికమ్మ
యిరుపూరు శేషమ్మ
ముడి సుందరమ్మ
ముడి బోయమ్మ
ముడి సుబ్బమ్మ
ముడి శేషమ్మ

ఆత్మకూరు తాలూకా

మహిమలూరు గ్రామం.

వాకాటి నరశింహ్మారెడ్డి
రామకృష్ణారెడ్డి
రామమ్మ
వెంకటసుబ్బమ్మ
లక్ష్మిదేవమ్మ
దేపూరు కమలమ్మ
చింతలపల్లి సుబ్బమ్మ

నువ్వురుపాడు గ్రామం.

యేలూరు కామమ్మ

ఆత్మకూరు గ్రామం.

తాళ్ళపురెడ్డి నారసింహ్మారెడ్డి
లక్ష్మమ్మ
శేషమ్మ
యిప్పగుంట రామచంద్రారెడ్డి
చెంచమ్మ
యిందూరు రామచంద్రారెడ్డి
దోర్నాదుల రాఘవరెడ్డి
శ్రీరాం శేషయ్య
పరిశేల వెంకటసుబ్బయ్య
బద్వేలి చిన్నపరెడ్డి
గుండాల సుబ్బరామిరెడ్డి
యింకా కొంతమంది

వహాలి గ్రామం.

రాజా వెంకటసుబ్బయ్య

గంగా చిరస్రిపనాయుడు
ఆదూరు వెంకటసుబ్బయ్యా
మేకా వెంకయ్యానాయుడు
కొప్పోల్ల వెంకటరెడ్డి
వాశిలి లక్ష్మినరసయ్యా
వాశీలి శేషయ్యా
యడ్లపల్లి అంకయ్యానాయుడు
కూనల ఆదెపనాయుడు

సంగం గ్రామం

కొణిడెల వెంకమ్మ

పెరమన గ్రామం.

చేవూరు అయ్యమ్మ
గొట్టిగొండాల కొండమ్మ
చిరివెళ్ళ రాఘవయ్యా
గండాల అయ్యమ్మ
యినగంటి చినకొండారెడ్డి

పడమటిపాళెం.

రెడ్డుల కొండారెడ్డి

దువ్వూరు గ్రామం.

యినగంటి అచ్చమ్మ
కంతం కోదండయ్యా
చింగిరి చలమయ్యా

శ్రీకొలను గ్రామం.

దగుమాటి. రామలింగారెడ్డి

ముక్కోపురం గ్రామం.

పెళ్ళకూరు శేషారెడ్డి
,, మహాలక్ష్మమ్మ
,, సుబ్బమ్మ
,, శేషమ్మ
,, అన్నమ్మగారు
మొలకల కమలమ్మ
,, శంకరమ్మ

వెంగారెడ్డిపాళెం.

ఆసం కనకమ్మ
నెల్లూరు కామమ్మ
పోలేపల్లి పిచ్చమ్మ

అన్నారెడ్డి పాళెం
గ్రామస్థులు అందరున్ను

యల్లయ పాళెం.

కాకుటూరు శీతారామిరెడ్డి

బ్రహ్మరెడ్డి పాళెం.

దువ్వూరు రామిరెడ్డి

చన్నపల్లిపాళెం

గండవరపు కోటమ్మ

వెంకన పాళెం.

సోమిరెడ్డి పిచ్చమ్మ
చెముడుగుంట సుబ్బమ్మ



సీ॥ జగతిలోపలనుండు జనసంఘములకెల్ల
వరయాదండము బెట్టి యభినుతింతు
క్షితిపలోపలనుండు స్త్రీపురుషులకెల్ల
సాష్టాంగములుజేసి సంతసింతు
మహిలోనగలయట్టి మనుజవరులకెల్ల
తగ్రప్రణామంబులు తనియనిడుదు
నిలపైనిజన్మించి నెలయుజీవులకెల్ల
వందనంబులుజేసి వడినుతింతు

తే॥ అవనినినుడు జలఘటములన్ని వింటె
అటులపరమాత్మ డీఘటా లన్నినిండె
వేరులేదుర యజ్ఞానమిడువుమనగ
ఆత్మనమ్మితినారాయ. ణార్యనిన్ను॥

సీ॥ వినువేడినానయ్య ననుగావరావయ్య
నీదాసుడను బ్రోవు నీకుశరణు
కడతేర్చరావయ్య కారుణ్యమీవయ్య
కాపాడవేమయ్య ఘనుడశరణు
నీదాసులమునేల నీకింత తాపేల
నాపాలభూపాల నార్యశరణు
ఆనందమునుగూర్చు అనలంబుచల్లార్చు
అచలంబుచేకూర్చు ఆర్యశరణు

తే॥ దుఃఖజాలంబులంద్రోచు దొరవుశరణు
నిర్మలానందహృదయుండ నీకుశరణు
జగము సమముగజూచునో స్వామిశరణు
ఆత్మనమ్మితినారాయణ ణార్యనిన్ను ॥

సీ॥ నీతివాక్యము నోట నిలచి చెప్పనివాని
జన్మంబు జన్మమే జగతిలోన
భక్తిమార్గము లేక భాగ్యముండినవాని
జన్మంబు జన్మమే జగతిలోన
గాయత్రిమంత్రంబు ఘనత దెలియనివాని
జన్మంబు జన్మమే జగతిలోన
తల్లిదండ్రులమాట దాటెడిపందల
జన్మంబు జన్మమే జగతి లోన
తే॥ తెలియనటువంటివారికి తేటపడదు
దీనిభావమ్ము నెరిగిన దివ్యపరులు
పరమపదవిని జెందంగ పాత్రులనగ
ఆత్మనమ్మితి నారాయ ణార్యనిన్ను॥ 8
సీ॥ నారాయణునిబోధ నమ్మియుండినచాలు
సామవేదము నీవు చదివినట్లు
నారాయణునిబోధ నమ్మియుండినచాలు
నిలయజుర్వేదంబు దెలసినట్లు
నారాయణునిబోధ నమ్మియుండినచాలు
పుడమి ఋగ్వేదంబు నుడివినట్లు
నారాయణునిబోధ నమ్మియుండినచాలు
సకలపూజ లెరింగి సలిపినట్లు
తే॥ వాదమేల నథర్వణ వేదమిదియె
అనుచు పెద్దలు నీరీతి ఆనతియ్యా
నిశ్చయంబుగ మనసును నిల్ప లేక
ఆత్మనమ్మితి నా·రాయ ణార్యనిన్ను॥

సీ॥ అజ్ఞానియొకటియే సుజ్ఞానియొకటియే
అష్టమదముల ఛేద మంతెగాని
అజ్ఞానియొకటియే సుజ్ఞానియొకటియే
షడ్గుణంబులు లేక సమసిపోవ
అజ్ఞానియొకటియే సుజ్ఞానియొకటియే
పంచేంద్రియంబులు భస్మమైన
అజ్ఞానియొకటియే సుజ్ఞానియొకటియే
మానాభిమానముల్ మాయమయిన

తే॥ జ్ఞాని అజ్ఞానియొకటియే జ్ఞాతవేరు
వేషములుదాల్చ అజ్ఞాని వెతలునిడవు
భాష నేర్చిన బాధలు బాయవనగ
ఆత్మసమ్మతి నారాయణార్యనిన్ను ॥ 10

సీ॥ ప్రాణనాథునిమీద పంతగించినసతి
యమునిచేతులయందు ఆర్తిజెందు
ప్రాణనాథునిమాట పాటించిపినసట్టి
కాంత కష్టంబులు కాలుదెరుగు
ప్రాణనాథునిబట్టి పలుమాటలడిగిన
కొమ్మపాటును చిత్రగుప్తుడెరుగు
ప్రాణనాథుని మది పాలించికలియని
మగువజేసిన మేలు మంటపాలు

తే॥ యువిదలందరుగుమిగూడి యొకరికొకరు
తెలిపికొనుచును కాంతంబు దెచ్చుకొనుడు
ప్రాణనాథుడే దైవంబు భామకనగ
ఆత్మసమ్మతి నారాయణార్యనిన్ను ॥ 11

సీ॥ కల్లులో బ్టైలు విప్పి కోళ్లనుఖండించి
భక్షించు బహుదొంగ భడవలకును
చిన్న పెద్దలమాట చెవిబెట్టికల్లుత్రా
పేట్లాటలాడిన చెనటులకును
వేసారకల్లుత్రా గీసానికెక్కక
సారాయిత్రాగెడి శ్వానములకు
ఆయాసమును లేక అలవాటువిడలేక
పరకాంతలనుగోరు పాపులకును

తే॥ కడుపబోవదు దుఃఖంబు వీరికెపుడు
కంటముఖమును వీక్షించు వారికెపుడు
దుఃఖశోకంబు లెప్పుడు దోచుననగ
ఆత్మనమ్మితి నారాయణాఖ్య నిన్ను ॥ 12

సీ॥ ఇన్నియుగంబులు నెట్లుగతించెనో
కలియుగంబును నేను గాంచినాను
ప్రథమపాదమునందె భయముగల్గెను నాకు
మంచిజన్మమునిచ్చి ముంచినావు
ఊరకున్నను గాని వైరంబుగల్గును
పండుకొనుట కింట భయముగల్గు
వేగులేచినదాది విభవవార్తలె గాని
వేదశ్రుతులఘోష వినగరాదు

తే॥ మంచివారికి మర్యాద మాసుకొనెను
మాయమాటలు నిలయందు మంచివారె
కల్లలాడుచు కాలంబు గడుపలేక
ఆత్మనమ్మితి నారాయణాఖ్య నిన్ను ॥ 13

సీ॥ రామనామము నోట రానట్టి రంగమ్మ
చెంగమ్మ నెన్నికల్ చేయుచుండు
అచ్చమ్మ పిచ్చమ్మ ఆదెమ్మ మాటలు
అన్నమైనను లేక ఆడగలరు
పోలమ్మ రామమ్మ పొయ్యికాడంజేరి
కొఱగాని మాటలూ కొండట్టగలరు
కొండమ్మ అవల కోటమ్మ యీవల
కనుసైగతో మాట కానగలరు
తే॥ మంచి చెబ్బరలే నట్టి మాటలెల్ల
లోభమే గాని యుండదు లాభమనగ
చూచిచూచియు యెన్నాళ్లు సుఖము లేక
ఆత్మ నమ్మిరతి నారాయణార్యనిన్న ॥ 14

సీ॥ శాంతంబుగా నోట శంకరా యన్నను
నారాయణా యన్న నర్థమొకటె
కేశవా యనుపల్కు గేరి చెప్పినగాని
హరి హరి యనుమాట అర్థమొకటె
పరమాత్మ తేజంబు భావమందున నిల్పి
మనసు నేకము జేయు మాన్యులకును
పల్కు వేరగుగాని పరమార్థమొక్కటె
మతములెన్ని విలప స్మృతులకెల్ల
తే॥ యెందు జూచిన చైతన్య మెరుక చేత
భేదమింతైన లేకయే బాధ లేక
వెలయుచున్నారలని మది వెతలు మాని
ఆత్మ నవిస్మృతి నారాయణాఖ్యనిన్న ॥ 15

సీ॥ నీదయనాపైన నిండియుండినచాలు
పరగెత్తుమనసును పట్టుబరుప
నీచూపునాపాయ నిలిచియుండినచాలు
షడ్గుణంబులలోని పారమెడుప
నీరూపునాకంట నిండియుండినచాలు
రూపనామక్రియల్ రూపుమాప
నీప్రేమనాప్రాపు నిండియుండినచాలు
పాపరాశినివెంట పారదోల

తే॥ ఎట్టులైనను యీన్నాళ్లకేనిగాని
యెన్నిజన్మంబులకుగాని యెరుకచేత
విడువబోనయ్య నీపదంబు విడువనయ్య
ఆత్మసవిన్మృతి నారాయణార్యనిష్ఠ 16

సీ॥ గుణరహితుండైన గురుడుయేజగజెట్టి
గుణములారునుబట్టి కుదుటబెట్టు
నిజగుర్వువెదుకండి నీమంబువిడకండి
సత్యంబుగనుగొండి సౌఖ్యమండి
మాయగురులమనవమ్మ మరిదారిలేదమ్మ
బాధమెండగనమ్మ భక్తిసమ్మ
మనసునిశ్చలమౌట మనముగోరసదాటు
గురుబోధలేకున్న కుదరదన్న

తే॥ ఈస్వదున్నట్టుగాభావింప నుగ్గడగను
బోధమనసుకు పొసగంబు భూరిసుఖము
విషయసౌఖ్యంబు మనసుకు విషమసంగ
ఆత్మసవిన్మృతి నారాయణార్యనిష్ఠ 17

సీ॥ లేలేదు లేవయ్య లేకుంటె పోవయ్య
యీకీర్తి యగునంచు యెరుగలేదు
చెడ్డవాడనుకుంటె చెప్పిపోవగరాద
చెప్పిపోయిన నేమి చేయువాడ
తండ్రికిపడు కరు తనయులుండినగాని
యెచ్చుతగ్గులమది నెంచబోదు
యింతయేలను వాదు సదృష్టమిటులుండె
మాయందు మీ కేల మమతగల్గు

తే॥ మరువలేనయ్య మీ రూపు మానసంబు
కరుణజూడుము మాయందు కదలిరమ్ము
వీడు నామంబు పానంబు నిత్యమనుచు
ఆత్మసమ్మతి నారాయణార్య నిన్ను ॥ 22

సీ॥ అష్టమదంబులు నన్నంటియుండినగదా
నను గావమని మిమ్ము నమ్మగలిగె
షడ్గుణంబులు నన్ను షంపుచుండగగదా
నను గావమని మిమ్ము నమ్మగలిగె
మూడవస్థలు నన్ను మూంచుచుండగగదా
నను గావమని మిమ్ము నమ్మగలిగె
పంచేంద్రియంబులు చంచలించగగదా
నను గావమని మిమ్ము నమ్మగలిగె

తే॥ వీని నడుమను నేజిక్కి విసుగుచుండి
యెటుల చూచిన దుఃఖంబు యెక్కువాయె
వేదుకోవయ్య నీ చెంత చేరియుండు
ఆత్మసమ్మతి నారాయణార్య నిన్ను॥ 23

సీ॥ షడ్గుణంబులు లేని సారంబు నీ రూపు
చవి లేదు కాబట్టి చనరుయిటకు
మూడవస్థలు లేని మురిపెంపు నీ రూపు
చవి లేదు కాబట్టి చనరుయిటకు
అష్టమదంబులు అంటవి నీ రూపు
చవి లేదు కాబట్టి చనరుయిటకు
వాప భేదము లేక వర్తిల్లు నీ రూపు
చవి లేదు కాబట్టి చనరుయిటకు

తే॥ అరయ గంజియె పానకంబనెడివారు
పాలమీదను నా పేరు వడ్గ బోరు
గొంచి చూడగ పాల నే రుచి కావనగ
ఆత్మ నమ్మికతి నారాయణ కార్యనిత్య॥

సీ॥ చూచితే బ్రహ్మాంబు చూడంగవలె గాని
వేరు చూపులం జూడ వెత్తితనము
నడచితే గురువెంట నడువంగవలె గాని
వేరు బాటల నడ్వ వెత్తితనము
ఆడిన సత్యంబు లాడంగవలె గాని
వేరు మాటలు నాడ వెత్తితనము
పాడిన తత్వంబు పాడంగవలె గాని
వేరు పాటల పాడ వెత్తితనము

తే॥ వినగవలెనన్న సద్బోధ వినగవలయు
చనగవలెనన్న గురుమాట చనగవలయు
నమ్మవలెనన్న గురుమాట నమ్మవలయు
ఆత్మ నమ్మికతి నారాయణ కార్యనిత్య॥

సీ॥ పరకాంతగనినంత భ్రమిసిచూచెడిమది
గురుపాదములునమ్మి కుదురబోదు
సత్యంబుచెప్పను సంకోశపడుమది
గురుపాదములునమ్మి కుదురబోదు
అన్నదమ్ములటంచు అపేక్షపడుమది
గురుపాదములునమ్మి కుదురబోదు
పరులనుదూషించు పనికిమాలినమది
గురుపాదములునమ్మి కుదురబోదు
తే॥ జీవరాశిని సమముగా భావమెంచు
మనసుతప్పక బ్రహ్మంబు మార్గమరయ
యితరమార్గంబులన్నియు యెక్కువనగ
ఆత్మనమ్మితి నారాయ ణార్యనిన్ను॥ 26
సీ॥ సరిగమల్ పాడుచు సంచలించెడిమది
నిశ్చలంబుగ దేవు నెరుగబోదు
యిరుగుపొరుగులపోరు వినిసంభ్రమపడుమది
నిశ్చలంబుగ దేవు నెరుగబోదు
తనకుమించినపనికి త్వరపడునామది
నిశ్చలంబుగ దేవు నెరుగబోదు
కష్టమొచ్చెడివేళ కలతజెందెడిమది
నిశ్చలంబుగ దేవు నెరుగబోదు
తే॥ నిష్ఠగలిగియునీయందు నిలుచుమనసు
యిట్టి విషయంబులన్నియు విడిచిపెట్టి
యేకదృష్టినిమనసుకు నెరుగజేయ
ఆత్మనమ్మితి నారాయ ణార్యనిన్ను॥

సీ॥ స్థూలదేహంబునిక చూడంగలేదాయె
సూక్ష్మదేహంబునిన్ను జేరగలేదు
కారణదేహంబు కానంగలేదునిక
జాగ్రతనీరూపు చాటలేదు
స్వప్నంబునీ వేళ వచియింపలేదాయె
తమరూపుసుషుప్తి తగలబోదు
యింకెట్లుమీరూపు యెరిగించవేమయ్య
యేలాగువెతకితే యెరుకపడును

తే॥ యిన్నిలేనట్టిమార్గంబు యేదోయదియె
తన్నుయెరుగుతురీయంపు తత్వమనుచు
నాకుజెప్పంగవిన్నపై మనంబునుంచి
ఆత్మసమ్మతినారాయణార్యనిన్ను॥

సీ॥ గ్రంథంబులన్నియును కెలకిచూచినగాని
గురువుచూపినబాట గురుతుగాదు
వేదంబులన్నియును వెదకిజూచినగాని
గురువుజూపినబాట గురుతుగాదు
సకలశాస్త్రంబులు చదివిచూచినగాని
గురువుజూపినబాట గురుతుగాదు
గాయత్రిమంత్రంబు ఘనభావమునుజూడ
గురువుజూపినబాట గురుతుగాదు

తే॥ మనసులోనుండు మర్మంబు మానవేశ్వ
జనకి సాధింపనేమియు వేరులేదు
వేదవాదలసంబులన్నియు వెకలటన్న
ఆత్మసమ్మతినారాయణార్యనిన్ను॥

సీ॥ తిథివారనక్షత్ర తెరదీసివేయగా
సమరసభావంబు సరళిగాదె
గొప్పకొద్దులనెడి గోడడ్డులేకున్న
సమరసభావంబు సరళిగాదె
తూర్పు పడమరయన్ మార్పులులేకున్న
సమరసభావంబు సరళిగాదె
మానాభిమానమన్ మడుగడ్డులేకున్న
సమరసభావంబు సరళిగాదె

తే॥ యివియెమాయకు హేతువై వెలయుచుండు
జరుగవలెనయ్య యివిలేని స్థానమునను
విడువబోకున్న ఘనమంచు యెరుగజేయు
ఆత్మనమ్మితి నారాయ ణార్యనిన్ను॥ 30

సీ॥ భార్యపిల్లలమీద భ్రమశియుండునుకొంత
సొమ్ములులేవంచు సొలయుకొంత
భూములులేవంచు పొరపాటునుకొంత
గొడ్డుగోదులచింత గొడవకొంత
యిండ్లులేవనికొంత యార్గంబుమరికొంత
ధనములేదనికొంత ఘనముకొంత
గురువుదొరకకకొంత గురినిల్వకనుకొంత
చిత్రంబులనుకొంత చిక్కుకొంత

తే॥ కొంతకొంతంచునిదెజీవ కొల్లబెట్టె
మననుయీరీతి చెప్పుచు మాపుగడుపు
పగలుయీరీతి జెప్పియు పాదుచేయు
ఆత్మనమ్మితి నారాయ ణార్యనిన్ను॥ 31

సీ॥ పేమున్నైబడి పేరాసనేప్పంగ
వెళ్లిపోయినజీవి కేమియెరుక
యేడ్చియేడ్చియుగొంతు యెండిపోవుటె గాని
వెళ్లిపోయినజీవి కేమియెరుక
క్రిందమీదనుపొర్లి గిజగిజలాడిన
వెళ్లిపోయినజీవి కేమియెరుక
పరలోకమున యేప్వ నైనంబు దెలియక
మనసునేడ్చెడివారు మహిని గలరు

తే॥ జన్మగో నెల్ల మానవ జన్మ మేలు
యనుటసత్యమనుమాట మనసు కెక్క-
రుట్టిమనుజుడుయెక్కువో యెఱుగుకొరకు
ఆత్మసమ్మతి నారాయణ ఖ్యాతినున్న॥ 34

సీ॥ ఒరులనునిందించ నొప్పకొందురుగాని
తన్ను తానిందించి తెలియలేరు
వేరుమాపులుజూచి నవ్వులుబొందుదురు గాని
తనమాపు తా జూచి తెలియలేరు
యితరులమాటలు యెగతాళిజేసేరు
తనమాటతప్పులు తెలుపబోరు
యింకొకరినడత లెంచబోదురుగాని
తననడతలో తప్పు తెలుపబోరు

తే॥ పుట్టినప్పుడేయీ బుద్ధి పట్టుబడియె
బ్రహ్మవ్రాసినవ్రాలు దుర్భరములైన
[illegible] గరిగించునని చూడుమునగ

సీ॥ అలసకే నియులేదు అరకదున్నగ నాకు
నీయందుమనసును నిలుపలేను
కలకాలమైనను కల్పుతీయుదుగాని
నీయందుమనసును నిలుపలేను
కొడవలిచేబట్టి కోలకోయుదుగాని
నీయందుమనసును నిలుపలేను
స్వగ్గనోష్ణలులేక పద్గుడంచెడిగాని
నీయందుమనసును నిలుపలేను
తే॥ ఆశమోసముయెరుగ దన్నటులగాను
అన్యమాటలుసత్యంబు అంటినట్లు
నీమసూపంబు నిత్యము నెరుగపనగ
ఆత్మనమ్మితి నారాయణాఖ్యనిన్ను॥ 36

సీ॥ యినకొండ అంకమ్మ యీమారుపోలమ్మ
ముందరిపొట్టెమ్మ ముంగరమ్మ
కనకదుర్గాంబమ్మ గట్టుకొండాలమ్మ
గంగమ్మకామమ్మ గంపలమ్మ
చెంచుకాశేరమ్మ చెలగికర్గోలమ్మ
నరయపిట్టాలమ్మ నాగలమ్మ
మహాలక్ష్మిమహామ్మాయి మారమ్మచౌడమ్మ
పిల్లలకాశేరి పిక్కలమ్మ
తే॥ యిట్టిదేవతలెల్లను యిలనుజేర
చిక్కినానయ్య చిక్కిన చిలుకరీతి
దిక్కుదెలియక దైవాల దేవుడనుచు
ఆత్మనమ్మితి నారాయణాఖ్యనిన్ను॥ 37

సీ॥ తల్లిదండ్రులచేత తనువుద్భవంబాయె
తలచరా తలిదండ్రి దైవమనుచు
తలిదండ్రిలేకున్న తామను లేడాయె
తెలియరా మర్మంబు తేటపడగ
తలిదండ్రులెందుకో తనయులెందుకో చూడ
యెందుకీయేర్పాటు యెరుగరాదు
యెందుకు సుఖదుఃఖ మెందుకు జన్మంబు
అనుసంశయముగదా ఆపుడేయు

తే॥ యిట్టి సందేహమంతయు విడిచిపెట్టి
ఘట్టివైరాగ్యంబు మనసందు గడియబట్టి
గురువుదరిజేర మోక్షంబు దొరుకునన్న
ఆత్మసమ్మతినారాయ ణార్యనిన్ను॥ 42

సీ॥ కల్లుత్రాగెడి దుష్టకర్ముండు కర్ముండు
గడచునా యమలోక గతులుగాక
షారాయిపూరించు చపలుండు చపలుండు
పోవునా యమలోక పురముదాటి
పరస్త్రీలగోరెడు పాపుండు పాపుండు
కదలునా యమలోక గమిడిదాటి
నాపాటిలేరనెడి నరపశ్వు నరపశ్వు
నడచునా యమలోక నరకమిడచి

తే॥ దుఃఖమీనాల్గు యమలోక దూతలయ్యె
వీటివిడిపించు వీలును వెతకరయ్యె
వీటివిడిపించ యమునికి వెరుపడనగ
ఆత్మసమ్మతినారాయ ణార్యనిన్ను॥ 43

సీ|| గురుపుల నిందించు కుటిలుల కెరుకరో
పరమగూఢంబైన పరమపదవి
పెద్దలనిందించు పందుల కెరుకరో
పరమాత్మయనునట్టి భావమెరుగ
యతులను నిందించు యెలులకు యెరుకరో
పరబ్రహ్మమనునట్టి పరమబయలు
వేషమూషణజేయు వెధవలకెరుకరో
సాధుల ఆనంద సౌఖ్యపదవి
తే|| తారతమ్యంబు దెలియని తామసులకు
యేముడు వలవేశి యున్నాడు యెరుగరయ్యా
నమ్మి నామాట న్యాయంబు ననుచు చెప్ప
ఆత్మనమ్మితి నారాయణార్యనిన్ను || 44
సీ|| క్రోధంబుబట్టినవారి కోరతవేయు యముండు
నారాయణాయంచు నడువరాదె
దుర్మార్గనరులను దుండించును యముండు
నారాయణాయంచు నడువరాదె
కోపంబుగలవారి కోదండమేయుంచు
నారాయణాయంచు నడువరాదె
జారచోరులబట్టి చేరంపములగోయు
నారాయణాయంచు నడువరాదె
తే|| వేదశాస్త్రంబు లీరీతి విశదపరుప
పులులసమమంచు గుణముల పోల్చలేక
దిక్కుదెలియక నీవె నాదిక్కటంచు
ఆత్మనమ్మితి నారాయణార్యనిన్ను 45

సీ॥ శమన కింకరులతో సంసారమునుజేయ
మరగి మరచితిమయ్యా మదినిభక్తి
ఆలుపిల్లలువారె అన్నతమ్ములువారె
అక్కచెల్లెలువారె అంతుదెలియ
బావమరుదులువారె బంధువర్గమువారె
అత్తమామలువారె అంతుదెలియ
పినతండ్రియెవరయ్యా పెత్తండ్రియెవరయ్యా
ప్రాణస్నేహితులెవరో పొరజూడు
తే॥ మంచిజ్ఞానంబు గలయట్టి మనుజుడైన
పాడుజేసియు యమపురి కంపగలరు
వేరులేరయ్యా కింకరుల్ వెతకుమనగ
ఆత్మసమ్మతినారాయ జ్ఞానినమ్మ ॥ 46
సీ॥ భార్యపిల్లలువెట్లు బ్రతుకుదురనియేడి
చింతమాత్రమెగీత చెరుపబోరు
యిర్గ పొరుగలజూచి యేడ్చుచుండుటె గాని
తలవ్రాత తుడువను తరమె మనకు
కష్టమొచ్చినవేళ కడుదుఃఖపడుటేల
ముందుబెట్టినకష్ట మెందుబోను
యింతలేమిడినేను యెట్లోర్చెదనుయన్న
పెట్టుకున్నను పృథ్వి పుట్టబోదు
తే॥ యిప్పుడనుకున్న కార్యంబు యేమిటికద్దు
యెద్దివచ్చిన సమముగా యెంచవలయు
యిప్పుడైనను సుఖంబు తెరుగుమనగ
ఆత్మసమ్మతినారాయ జ్ఞానినమ్మ ॥ 47

సీ॥ యముడు బెట్టెడిబాధ యెట్లోర్చెదవు నీవు
ఆలుబిల్లలునీకు అడ్డపడరు
యముడు బెట్టెడిబాధ యెట్లోర్చెదవు నీవు
రక్షించబోరన్న తమ్ములెవరు
యముడు బెట్టెడిబాధ యెట్లోర్చెదవు నీవు
ప్రాణస్నేహితులడ్డ పడగబోరు
యముడు బెట్టెడిబాధ యెట్లోర్చెదవు నీవు
రక్షించరాదయ్యా తల్లిదండ్రి
తే॥ యొకరమీదను యాశ యొకరికేల
కర్మ శేషంబు యీతీరు గలిగెగాని
నీవు నిజమని నమ్మకు నిక్కువనగ
ఆత్మసమ్మితి నారాయ ణార్యనిమ్న॥ 48
సీ॥ కోటికిపడగెత్తి గొప్ప బొందినగాని
మనసుతృప్తిని జెంది మానుకొనదు
వేదంబులును నాల్గు సాధించినను గాని
మనసుతృప్తిని జెంది మానుకొనదు
భూపతిగాబుట్టి భూమునేలినగాని
మనసుతృప్తిని జెంది మానుకొనదు
గొప్పగాబంగారు కొండలు దొరకినా
మనసుతృప్తిని జెంది మానుకొనదు
తే॥ మనసునకుచాలు భాగ్యంబు మహినిలేదు
పరమ ఆనందమునుగూర్చు భాగ్యగురువు
దరినిజేరిన మనసుకు తనివియనగ
ఆత్మసమ్మితి నారాయ ణార్యనిమ్న॥ 49

సీ॥ మట్టిగుంటను బెట్టి మన్నుగప్పెడి మేను
సబ్బుబిళ్ళలతోటి స్నానమేల
కుక్కలు భక్షించు టక్కుబొమ్మకు నేల
పట్టంచుధోవతల్ పరుపుదిండ్లు
కట్టెపుల్లలు పేర్చి కాల్చివేసెడిమాయ
ఘటము కేలను కీర్తి గౌరవములు
నెత్తురు మాంసంబు నిండుబొమ్మకు నేల
బంగారు నగలను బాగుబెట్టి
తే॥ యేహ్యమనుచును మర్మంబు నెరుగబోరు
తెలియలేరయ్య మాయను తొలుగలేరు
యిట్టి బూటక మెరుగుట యెవరొయనగ
ఆత్మసమ్మితి నారాయణార్యనిన్ను॥ 50
సీ॥ తలిదండ్రులకునెల్ల దహనకర్మలుచేయు
తనయునికైన దడుపుగలదె
తనయీడువారంత తనయెదుట మృతినొంద
మనగతియేమంచు కనగలేరె
పక్కలోనున్నట్టి బాలుండుచనిపోవ
జననికినేమైన జంకుగలదె
పోయెపోయెనటంచు పొర్లాడుటయెగాని
యేమిచిత్రమటంచు నెరుగబోరు
తే॥ యిట్టికపటంబుగల్పించు యీశుడెవడొ
కపటసూత్రంబు యెరిగెడి ఘనుడెవండొ
సర్వమయుడవునీవె సర్వంబుయనుచు
ఆత్మసమ్మితి నారాయణార్యనిన్ను॥ 51

సీ॥ లిఖితమయ్యెడియుండు లేములొచ్చెడివేళ
అనుభవించక తీరదయ్యామనకు
సుఖదుఃఖములురెండు జొరబారువేళలో
అనుభవించకతీర దయ్యామనకు
లాభనష్టంబులు లభ్యమయ్యెడివేళ
అనుభవించకతీర దయ్యామనకు
గౌరవంబపకీర్తి ఘటియించువేళలో
అనుభవించకతీర దయ్యామనకు
తే॥ దైవమువిధించునీరెండు తప్పబోవు
ఒక్కతీరునకాలంబు నుండుటరుదు
ఎప్పుడు విడదయ్యాకర్మంబు నెవరికనిన
ఆత్మసమ్మతినారాయ ణార్యనిన్ను॥ 52
సీ॥ నోసట వ్రాసినవ్రాలు నొకతీరుగానుండ
కోరినభాగ్యంబు కూడగలదె
ముందటికర్మంబు మూలమిప్పుడురాగ
భగవంతుడిచ్చిన ఫలముగలదె
ఆర్యులాడెడిమాట అపహాసమునుజేయు
పాపరాశికిమంచి బ్రతుకుగలదె
పరమాత్ముడేపాటి పక్షపాతియుగాడు
నీవిచ్చినంతయే నీకునిచ్చు
తే॥ పంచభూతంబులకుపైన బరగువాడు
యింద్రియంబులచేష్టల నెరుగువాడు
రాత్రిపగలునులేనిరా రాజనంగ
ఆత్మసమ్మతినారాయ ణార్యనిన్ను॥ 53

సీ॥ కోపంబుయనియెడి ఘోరమృగముజంప
గడ్డంబు పెంచిన ఘనుడవీవె
కామక్రోధంబనెడి కారు పులులనుజంప
కాషాయమునుగట్టు ఘనుడవీవె
మదమత్సరములను మదపు టేన్గునుజంప
రుద్రాక్షు దాల్చిన రుద్రుడీవె
మోహ లోభములను మొనగాంద్ర జతజ
విభూతి పూసిన వీరుడీవె
తే॥ పెంచవలెనన్న గడ్డంబు పెంచవచ్చు
పూయవలెనన్న భూతిని పూయవచ్చు
నిలుపలేరయ్య గుణములు నిక్కమనగ
ఆత్మసమ్మ్రతి నారాయణార్యనిన్ను॥ 56

సీ॥ యింద్రియంబులమత్తు హీనపరచియెకదా
వేమనార్యులుభువి వెలయగలిగె
యింద్రియంబులమత్తు హీనపరచియెకదా
బ్రహ్మంబు సిద్దయ్య బడసెకీర్తి
యింద్రియంబులమత్తు హీనపరచియెకదా
తరిగొండ వెంగమ్మ పరముజేరె
యింద్రియంబులమత్తు హీనపరచియెకదా
మస్తాను హాజరత్తు మహినివెలసె
తే॥ రామదాసును కబీరు రమణమీర
జరుపుచున్నారు మహిమలు జగతియందు
గాన వైరాగ్య మిలయందు గాంచుమనగ
ఆత్మసమ్మ్రతి నారాయణార్యనిన్ను 57

సీ॥ మొగలిపువ్వును దెచ్చి మెప్పి చేతికినివ్వ
పెట్టవలసినచోట పెట్టబోడు
పిల్లికూనను దెచ్చి ప్రియముతో బెంచిన
పాలకుండనుదోఁయు పంతమిడదు
ఉండ కుండగబోదు ఉల్లిగడ్డకు కంపు
పన్నీరు పూసిన బయలుపడును
లోకవాసనయనెడి లోభంబుచేన్వరుడు
పరమ ఆనందంబు పాదుజేయు

తే॥ ఉల్లికంపకు పన్నీరు నోర్చనట్లు
చల్లపాత్రను నిలదోఁయు పిల్లియట్లు
చలనమునకోడి అచలంబు తొలగుననగ
ఆత్మనమ్మృతి నారాయ ణార్యనిన్ను॥ 58

సీ॥ యేమిరా యీనటన యెంచి చూడగ స్ఫుట
ఉత్తమాటలుగావు ఉన్నదింతె
సిరిసంపదలు గల్గి చెలగుచుండెడివేళ
బంధులే యూరూర పారజూడు
కలిమిభాగ్యముతగ్గి కష్టంబులోనున్న
యున్నట్టి బంధువుల్ ఉత్తదాయె
చేతుల కష్టంబు చేయుచుండిననాస్ఫు
సతి సుతుల్ నీకింపు జరుపగలరు॥

తే॥ శక్తిలేకను కష్టంబు సైపలేక
యూతకఱ్ఱియు చేబట్టి యూగునాడు
పలుకనివ్వరు నోరెత్తి పాపమనగ
ఆత్మనమ్మృతి నారాయ ణార్యనిన్ను॥ 59

సీ॥ తనువు మాంసబాధయే తన్వి యెవ్వరో యెంచు
తర్కించుచుండుకే తారకంబు
ధ్యానంబు లేదంచు దూషి తెలిసినవెన్క
సాధించపూనుకే సాంఖ్యమగును
చెల్లు నేమియు లేక చెదరకుండగనిల్వ
అమనస్కయోగాను అదియె సుముక్తి
అదియె జీవన్ముక్తి అదియె పరిపూర్ణంబు
అదియె బ్రహ్మైక్యంబు అనుట బుధులు

తే॥ ఇట్టి పరిపూర్ణ మహిమను ఎరుగు నరులు
జన్మ జన్మంబులకుగాని జరుగబోదు
నిక్కమనగను ఈబాట చిక్కకొరకు
ఆత్మనమ్మితి నారాయ భాగ్యనిన్ను॥ 60

సీ॥ ముద్రలోపల బయల్ ముందుగన్పడుగాని
సర్వంబు బయలంచు చాటబోదు
ముద్రటించును మనము మురియుచుండుటెగాని
ఎగురు పెద్దుప గంత ఎత్తురీతి
వేరువస్తువు జూపు వెఱ్ఱిముద్రలు నేల
తనుతాను జూచుకే తగినముద్ర
తన భార్యనిడనాడి తగినట్టి పనియుంచు
విటకత్తె పొందుకై వెతకినట్లు

తే॥ సుఖము లేకున్న గొప్పకు సుఖమటంచు
ఏడ్చుచున్నారు నిజమును ఎరుగలేక
బయలు కన్యంబునంతయు బాధయనగ
ఆత్మనమ్మితి నారాయ భాగ్యనిన్ను॥ 61

సీ॥ అరయముద్రలు నైదు అంటిచూడకయున్న
ముక్తి లేదనియొకడు మరియుచుండు
శాంభవి ముద్రకి సారమెరిగిన జాలు
పనిలేని పొట్టని పలుకునొకడు
ఖేచరి భూచరీ క్రియసాధకరాజని
పట్టువిడువకుమంచు పలుకునొకడు
మధ్యాలక్ష్యముచాల మంచిదయని చెప్పి
వాదుచుందురు మనుజ వరులుచాల॥

తే॥ వీటివల్లను బ్రహ్మంబు విదితమగునె
పంచముద్రల పట్టించు పరమముద్ర
ఎరుగవలెనన్న విాదయ యోదనుమంచి
ఆత్మనమ్మతి నారాయ ణార్యనిన్ను 82

సీ॥ అతిధి వాకిటజేరి అరచి భిక్షమువేడ
ఆదరించుటగాదె అచలపదవి
కొట్టితిట్టియు తన్ను కోపించువారిని
ఆదరించుటగాదె అచలపదవి
తన శత్రువులనెల్ల తనకు మిత్రులటంచు
ఆదరించుటగాదె అచలపదవి
నొప్పించ కొరులను నొవ్వకుండగతాను
ఆదరించుటగాదె అచలపదవి॥

తే॥ ఇట్టి సద్గురు దరిజేర యిమునుకర్మ
అట్టిగురువులు దొరకుట యరుదనంగ
నీకు అన్యము నితరుల నెరుగలేక
ఆత్మసమ్మతి నారాయ ణార్యనిన్ను॥ 83

సీ॥ సాలెజంగమజాంగ్రప్ర సాతానిబట్టులు
గొల్లకమ్మలురెడ్లు కుమ్మరులును
బోగమీడిగతురక బుడబుక్కదొమ్మర
బంటపాములయెరుక బ్రాహ్మకులము
యానాదిచెంబడి యాలమకప్పలసడ్డి
కంసాలిమంగలి కమ్మరులును
బొందిలిబట్రాజు బోయసుకాలి
మాలమాదిగచెంచు మరాటిశెస్త్ర

తే॥ రజకగంధర్వదాసర నిరాజ్యమందు
అరరెయాకపటనాటకం బరసిచూడ
పరగబొంపలేరు పరమాత్మయొకటన
ఆత్మసమ్మిత్రి నారాయణార్యనిన్ను 72

సీ॥ యెలులుయేనుగపులుల్ యెనుముఎద్దులుజింక
తోడేళ్ళుపందులు దుప్పులొంటె
కుక్కలుపిల్లులుగాడ్దె గబ్బిబునక్కలు
సీమకుక్కచిఱుత సింహములును
గొర్రెకోతులుమేక కుందేళ్ళమెంటపల్
కస్తూరిమృగములు కణుతలిత్త్రి
ముంగిసముచ్చెంగి ముండ్లపందియుడుత
యుడుముతొండయుబల్లి మూసరెల్లి

తే॥ అరసెయాకపటనాటకం బరసిచూడ
పరగబొందలువేరు పరమాత్ముడొక్కడె
అనెడివాక్యంబురీతిని అరయుమనగ
ఆత్మసమ్మిత్రి నారాయణార్యనిన్ను॥ 73

సీ॥ కాకికోవెలచిల్క కాఁజకొంగయు నెమలి
గుడ్లగూబలుగద్ద కోడిచిలువ
పమిడికంటెపిచుక పాలపిట్టల్లంకి
గోరంకికొక్కెర గూడబాతు
నల్లంచినకచిత్ర నారాయణాపక్షి
కంకణజీరంగి కంపకోడి
గిజిగాడిసాళువ గిన్నికోళ్ళనుడేగ
పొట్టిబాతులుగువ్వ బోరవలును
తే॥ అరరెయీకపటనాటకం బరసిచూడ
పరగబొందెలువేరు పరమాత్ముడొక్కడె
అనెడివాక్యంబురీతిని అరయుమనగ
ఆత్మసమ్మతి నారాయ ణాఖ్యనిన్ను॥ 74
సీ॥ వెలగవేపియువేప వెదురుచింతయుజువ్వ
మఱ్ఱిపిర్నసమునగ మామిడపిశె
చందనముచందనము చౌకబూరగిమద్ది
పొన్న పొగడలునిమ్మ పునుగజామ
శ్రీకటూకియుకుమ్మ టెంకాయకుంకుడు
నేరేడుమారేడు నెద్దినద్ది
పనసరేగునుతాడి పచ్చారిగన్నేరు
అరటియీతయుఁ ఇప్ప ఆరెగొట్టి
తే॥ అరరెయీకపటనాటకం బరసిచూడ
పరగజన్మంబువొక్కటే ఫలితమేరు
అనెడివాక్యంబురీతిని అరయుమనగ
ఆత్మసమ్మతి నారాయ ణాఖ్యనిన్ను॥ 75

సీ॥ సూదిబెజ్జమునందు జొప్పించనంటెను
సాధ్యంబుగాదయ్య జగతియందు
గోవుపాలనుపిండి గోసంటికెక్కింప
సాధ్యంబుగాదయ్య జగతియందు
తనకుగల్గినసుతుల తనలోననిమిడింప
సాధ్యంబుగాదయ్య జగతియందు
వేటివెల్లువత్రిప్పి వెనుకకునడిపించ
సాధ్యంబుగాదయ్య జగతియందు

తే॥ షడ్గుణంబులుపీటితో సహముగాద
గుణములారుటినిలయందు కూర్చివేయ
జన్మరహితంబునిలయందు జయమనంగ
ఆత్మసమ్మృతి నారాయ ణార్యనిన్ను॥ 80

సీ॥ బ్రహ్మాండమంతయు పాలించుపరమాత్మ
జీవుడనేనంచు చెప్పగలిగె
ఆనందమును నెపుడు అనుభవించెడిబ్రహ్మ
జ్ఞానవిమోక్షంబు అందగలిగె
రూపనామములేని రూపాంతకుండిల
ఖండరూపములెత్తి గడుపగలిగె
యేవికారములేని యేకాక్షరుండిల
అఖిలవికారంబు లంటగలిగె

తే॥ తెలిసితెలియనివారికి తెగనిగొడవ
తెలియవలనయ్యగురునిచే తేటపడగ
తెలియనటువంటి వారికిది తిక్కయనగ
ఆత్మసమ్మృతి నారాయ ణార్యనిన్ను॥ 81

సీ॥ అయోధ్యనిడి రాము డడవి కేగినరీతి
పరిపూర్ణమిడియాత్మ బయలుదేరె
నళరాజు రుతుపర్ణు నమ్మి కొలచినయట్లు
అజ్ఞానమున కొగ్గి ఆత్మయుండె
చండాలుడా హరిశ్చంద్రు దిట్టినయట్లు
నాత్మ యింద్రియములకు నణగియుండె
తనరూపమును మారు పక్షున్నికైపడి
ఆత్మ మాంసపుదేహ మంటగలిగె
తే॥ నపుడు తన రాజ్యపదవికి నరిగినట్లు
మరల మహినేలు హరిశ్చంద్రు మాదిగాను
జరుగనలెనయ్య యిహమిడచి సత్యమనగ
ఆత్మ నమ్మితి నారాయణార్యనిన్ను॥ 82
సీ॥ మహిమీద భాషలు మతములెన్నగ మనకు
తరముగాదిల లోన తరచిచూడ
కన్నడమింగ్లీషు ఘనతతురకము తెనుంగు
అరవసంస్కృత భాషలవనిలోన
శివబౌద్ధపాషండ శ్రీవిష్ణుమతములు
క్రైస్తుమహమ్మదు క్రమముగాను
రామానుజాహిందు రాజమతములయందు
పలుకుజనులకు లేదు పరమపదవి
తే॥ యిట్టిమతభాషలయందు యెంచలేరు
మతములెన్నయిన గుణముల మాన్పలేవు
మతములేనట్టి దేజ్ఞాన మహిమయనగ
ఆత్మ నమ్మితి నారాయణార్యనిన్ను॥ 83

సీ॥ మనసునిలుకడజేరు మార్గంబుగనుగొన్న
యితరమతములతోను రోయంచబోడు
మనసునిలుకడజేరు మార్గంబుగనుగొన్న
అన్యాంబులనాడ అరుగబోడు
మనసునిలుకడజేరు మార్గంబుగనుగొన్న
అన్యజీవులజంప నరుగబోడు
మనసునిలుకడజేరు మార్గంబుగనుగొన్న
తనువుశ్శృంగారంబు తాల్పబోడు

తే॥ కానిటువంటివారిని గాంచువారె
పెద్దలగుగానినితరుల పిలువరాదు
అనుభవంబునుమాటల కందడనగ
ఆత్మనవిస్మృతి నారాయణార్యనిన్ను 84

సీ॥ పంచభూతముచల్ల పంచేంద్రియములాగె
పరగినైదును ప్రపంచమాయె
కన్నుముక్కునునోరు కర్ణంబు కాయంబు
పంచాక్షరమనుచు పలుకుబుధులు
పంచాక్షరమునెపుడు పఠనచేయుమనుంటె
అయిదుమతముల చేత అణగగలవు
అయిదునొకటిగజేయు అతడెపోజగజెట్టి
పట్టినయీపట్టు పట్టవలయు

తే॥ యిట్టిమర్మంబు దెలియుట కిలనుజనులు
భూతిరుద్రాక్షజడలను పొందుగోరు
వున్నలేకున్న నొకటియై వుండుననగ
ఆత్మనవిస్మృతి నారాయణార్యనిన్ను॥ 85

సీ॥ రుద్రాక్షలకుజ్ఞాన రూపంబుకలదన్న
గజరాజు రుద్రాక్ష కట్టలేదు
భూతిబూసినజ్ఞాన పూర్ణులౌనవియన్న
సారంగధరుడెప్డు సలుపలేదు
జడలు పెంచుటవల్ల జన్మరహితంబన్న
జనకజాడేపాటి జడలు పెంచె
కాషాయములవల్ల కల్గుమోక్షంబన్న
కల్గెనామార్గ్గంబు ఘనుడుమందు

తే॥ కోర్కెతో వేయు వేషంబు కుటిలమన్న
తనకుతావచ్చువేషంబు తాల్చవలయు
కపటవేషంబునిజమును గాంచనవగ
ఆత్మసమ్మృతి నారాయ కార్యనిమ్ము॥ 66

సీ॥ అత్తమామలదిట్టి అవనిబ్రతుకుటకన్న
వనవాసిదిని జీవమొడలవచ్చు
మగనిమఱదులదిట్టి మసలుచుండుటకన్న
భక్షింపగన్నెరు పప్పుమేలు
అన్నదమ్ములదిట్టి అవనిబ్రతుకుటకన్న
వురివేసుకునిభువి వొరగవచ్చు
పాపాత్ములనుసేర బరగుచుండుటకన్న
పరులెరుగకనుభావి బడుటమేలా

తే॥ పురుషస్త్రీజాతులెవరైన పుడమినిట్టి
జీవనము గోరినిలనుండు జీవికన్న
త్రాగుటయు మేలువిషమును ధరణీయనగ
ఆత్మసమ్మృతి నారాయ కార్యనిమ్ము॥ 67

సీ॥ శివశివాశివశివా శివశివాయనువారు
శివలోకమందునా వెలగుచుండు
హరిహరీహరిహరీ హరిహరీయనువారు
వైకుంఠపురమునా వరలుచుండు
రామరామారామ రామయ్యాయనువారు
పుణ్యలోకమునందు పొరలుచుండు
కృష్ణకృష్ణాకృష్ణ కృష్ణయ్యాయనువారు
విష్ణులోకమునందు వెలయుచుండు

తే॥ జగతిలోపలగలయట్టి జనులలోన
నెవ్వరైననునీరీతి నెనరుగల్గి
భజనచేసినసౌభాగ్య పదవియనగ
ఆత్మనమ్మితి నారాయ ణార్యనిన్ను॥ 88

సీ॥ భక్తులగాపాడి పదవులిచ్చెడిదివ్య
నారాయు డెల్లప్డు నమ్మరయ్యా
సాధులగాపాడి సౌఖ్యంబులిచ్చెడి
నారాయు డెల్లప్పుడు నమ్మరయ్యా
దాసులగాపాడి దరిజేర్చుదేవుడు
నారాయు డెల్లప్పుడు నమ్మరయ్యా
కవివరులగాపాడి కరుణజూచెడిస్వామి
నారాయు డెల్లప్పుడు నమ్మరయ్యా

తే॥ భాగ్యభోగంబు లిలగోరు పాపజనులు
మోక్షమనవెద్ది నెరుగరు మూఢజనులు
కట్టకడ తేరుమార్గంబు గాంచరనగ
ఆత్మనమ్మితి నారాయ ణార్యనిన్ను॥ 89

సీ॥ కోడిపెట్టతో సమము గురువుగా నెంచుడీ
కోడిపిల్లలు శిష్య కోటులెంచు
వేదవాక్యములనెడి నెరువుదిబ్బలు త్రవ్వి
తమపిల్లలకునిచ్చు తత్వబోధ
అజ్ఞానమను గద్ద నటుదూరమున జూచి
భ్రమని పిల్లలకు భయముదీర్చు
పారియామొచ్చినతోడ పారదోలును గాని
పిల్లగద్దకు మధ్య పెట్టబోదు
తే॥ మంచి హితగురువు శిష్యుల మహిని గాంచి
కలిగి స్వతబుద్ధి పదమును గాంచు వరకు
విడదు సద్గురువని నెరుగుమనగ
ఆత్మనమ్మితి నారాయ ణార్యనిన్ను॥ 90

సీ॥ రాజ్యంబులేలిన రాజులందరుయేరి
మనముచ్చటలుయెంత మానరయ్య
గ్రంథంబులన్నియు కల్పించు కవులేరి
మనముచ్చటలుయెంత మానరయ్య
మాటతప్పనియట్టి మహిపతులేరయ్య
మనముచ్చటలుయెంత మానరయ్య
వెయ్యేండ్లు బ్రతికిన వేల్పులందరుయేరి
మనముచ్చటలుయెంత మానరయ్య
తే॥ అట్టిమహనీయులందరు అరగినారె
మాలపోలికవూరిలో మాటలేల
అనెడిసామ్యంబు మనబ్రతుకు అరయుమనగ
ఆత్మనమ్మితి నారాయ ణార్యనిన్ను॥ 91

సీ॥ కాళ్లుచేతులు లేని కరిమొండెమైనను
బ్రతుకజూచునుయోర బహుదినాళ్లు
సిరిసంపదలుపోయి చీకాకుపడుచున్న
బ్రతుకజూచునుయోర బహుదినాళ్లు
తినుటకన్నములేక తిరుపమెత్తుచునున్న
బ్రతుకజూచునుయోర బహుదినాళ్లు
ఐశ్వర్యమునుబోయి అపకీర్తిపాలైన
బ్రతుకజూచునుయోర బహుదినాళ్లు
తే॥ యిదియెజన్మంబునకునోర హేతువయ్యె
యింతతాపత్రయమెగాని యిదముమమముదు
చచ్చువారలు వూరకె చావరనగ
ఆత్మసమ్మతి నారాయణాఖ్యనిన్ను॥ 92

సీ॥ కులకాంతశయ్యపై కూడియుండెడివేళ
పాలుమాలికచేయు పాడునిద్ర
పరస్త్రీలశయ్యపై పవ్వళించినయపుడు
అంతులేనురనిద్ర అంటరాదు
పద్మాసనమువేళ పరమాత్మస్మరియింప
అప్పుడెముసరపించు ఘోరనిద్ర
చోరత్వమునకెళ్లి సొత్తులెదకెడివేళ
భస్మమైపోవుగా పాడునిద్ర
తే॥ జ్ఞానమునకు నజ్ఞానకాండమునకు
మంచిమాటకునిలచెడ్డ మాటలకును
చలముగలదన్న నివిరెండు సమతులనగ
ఆత్మసమ్మతి నారాయణాఖ్యనిన్ను॥ 93

సీ॥ బాల్యమందునయాట పరుగులెత్తుచునుండ
తీరికెప్పుడులేదె తిక్కమనస
యౌవ్వనంబున స్త్రీల యోగడంబులనుండ
తీరికెప్పుడులేదె తిక్కమనస
కౌమారమునగల్గు కర్మసంసారంబు
తీరికెప్పుడులేదె తిక్కమనస
వార్ధిక్యమందున వణకుగొణగలనుండ
తీరికెప్పుడులేదు తిక్కమనస

తే॥ యిట్టిజన్మంబునందజ్ఞాన మిడుపకున్న
తీరికింకెప్పుడుండునే తిక్కమనసు
మంచిగలిగించుగురునెదుక మార్గమనగ
ఆత్మనవిస్మృతి నారాయ ణార్యవిన్న॥ 94

సీ॥ కవివ్రాసి సుతికెక్కి ఘనతబొందినగాని
మనసునిలుకడలేక మంచిలేదు
రామకోటియువ్రాసి రామభజనలుచేయ
మనసునిలకడలేక మంచిలేదు
అమరనిఘంటలు అరగమెరిగినగాని
మనసునిలకడలేక మంచిలేదు
గోదానభూదాన కోట్లుచేసినగాని
మనసునిలకడలేక మంచిలేదు

తే॥ కోర్కతో చేయుధర్మంబు గొప్పయైన
కొద్దిఫలితంబుమాత్రమే కూడివచ్చు
భగవతార్పితమూగజేయ ఫలమనంగ
ఆత్మనవిస్మృతి నారాయ ణార్యనిన్న॥ 95

సీ॥ చీట్లాటపైమది శివునియందుంచిన
చిక్కదా మోక్షంబు చిటికెలోన
పరస్త్రీలపై ప్రేమ పరమాత్మునెడనుండ
చిక్కదా మోక్షంబు చిటికెలోన
గృహకృత్యములయాశ గురునియందుంచిన
చిక్కదా మోక్షంబు చిటికెలోన
ఐశ్వర్యములపయి ఆత్మయందుంచిన
చిక్కదా మోక్షంబు చిటికెలోన
తే॥ చోరుఁడొక్కడుకండంబు చొచ్చువేళ
యెంతజాగ్రత్తనుండునో యోగినీవు
యింద్రియంబుల నారీతి నెరుగుమనగ
ఆత్మవిస్మృతి నారాయణార్యనిన్ను॥ 96
సీ॥ సతిసుతులపోషించ సకలపాపముజేయు
చచ్చిపోయినవెనుక చాకుటెవరు
ధనధాన్యములుబహు తాపంబుననుదాచు
తానుచచ్చినవెనుక దాచుటెవరు
ప్రాణస్నేహితులంచు బహుసంతసమునుండు
జీవమిడిచినతోడ స్నేహమెవరు
భార్యతప్పులుచేయ పగబట్టిసాధించు
పరలోకమునకేగ భార్యయెట్లు
తే॥ అష్టబంధనలోకట్టై సారమాయ
సక్కబంధనమిడదీయు వరకుచాల
కష్టమికలేదుసులభంబు గాంచుమనగ
ఆత్మవిస్మృతినారాయణార్యనిన్ను 97

సీ॥ ఆలుబిడ్డలుతనకు అణగియుండకయున్న
సంసారమదిగొప్ప సాగరంబు
అన్నతమ్ములుతనకు అణగియుండకయున్న
సంసారమదిగొప్ప సాగరంబు
సిరిసంపదలుబోయి చిక్కులొచ్చినతోడ
సంసారమదిగొప్ప సాగరంబు
బీదతనమునభాగ్య పేరాసగలిగిన
సంసారమదిగొప్ప సాగరంబు
తే॥ సప్తజలధులనీదియూ సైపవచ్చు
యిట్టిసంసారమొకఘుంటయీదరాదు
ధరనుయీకష్టమునుదీర్ప దైవమనగ
ఆత్మనమ్మితినారాయణార్యనిన్ను 98
సీ॥ కాశిరామేశ్వరం కాళహస్తియుకంచి
తిరుపతరుణాచల తిరువళూరు
శ్రీశైలపిరుపాక్షు శ్రీపండరీపురి
సంఘుంబుమదురయు తుంగభద్ర
పాపవిమోచనా భద్రాచలంబును
త్రిపురాంతకముకోటి తీర్థవాది
శ్రీరంగమయోధ్య శ్రీరామతీర్థంబు
మంగళగిరిడిల్లి గంగయమున
తే॥ తిరిగిచూచుటమంచిదే తెలివిగల్గి
యేమిఈస్నానఫలితంబు యేమియంచు
యెందుకేర్పరచిరోపెద్ద లెరుగుమనగ
ఆత్మనమ్మితి నారాయణార్యనిన్ను॥ 99

సీ॥ రాచకురుపులు మేహ రోగందులును తీట
గజ్జకురదయు పైత్య గాసకొరుకు
తలనొప్పిజ్వరములు దామరకజన్నెలు
కడుపునొప్పియు కఱ్ఱల కండ్లుకలక
కీళ్లనొప్పులు లూట్లు కినురుపాటు నుజలుబు
మలబద్ధకము మురుకు మడిమిపోట్లు
పెద్దరోగము చచ్చు పిత్తవాతంబులు
శూలనొప్పులు పాడలు సుల్లదింద్లు
తే॥ చీము నెత్తురు మాంసంబు చేరినట్టి
యిట్టి జన్మంబు పై మోహ మెంతగలిగె
మత్తునిదువరకు నిది తెలియ మఱుగుయనగ
ఆత్మసమ్మితి నారాయ ణార్యనిన్న॥ 100

సీ॥ ధనము సంపాదించి ధర మేటియౌనన్న
అలకు బేరునికన్న అధికమున్నె
చదువు చదివియు జగతి సాధించవలెనన్న
శారదలోపాటి చదువబోదు
సౌందర్యమున నేను జగతి కెక్కువయన్న
మన్మథుసరిరూపు మహిని లేదు
బుజబలాఢ్యము చేత భువి నేలెదమునన్న
సమయాకుంఠుడు నెకాల యముని చేత
తే॥ ధనము శౌర్యంబు చదువును ధరణిలోన
అధికుడని చెప్పలోకంబు అంతులేదు
పరగ్రహ్లాదమువలెయే పదవియనగ
ఆత్మసమ్మితి నారాయ ణార్యనిన్న॥

సీ॥ ధనధాన్యములమది తెగలకుండినగదా 101
గురువులమేమంచు కులుకుటకును
అవనికనకము వెండి కాశవిడచినగదా
గురువులమేమంచు కులుకుటకును
వాయువీరనునట్టి వైరమిడచినగదా
గురువులమేమంచు కులుకుటకును
జిహ్వాగుహ్యము రెండు చెడకకుండినగదా
గురువులమేమంచు కులుకుటకును

తే॥ యిదియె అజ్ఞానమనునట్టి దిలనుమాయ
జీవుడను పేరుదీనికే చెలగుచుండు
పిటిపిడిపించ దేవుడై వెలయుననగ
ఆత్మసమ్మితి నారాయణార్యవిన్న॥ 102

సీ॥ మంచిమాటలుబైట మాట్లాడగనువచ్చు
కపటంబుమదిలోన కలుగవచ్చు
పరులకుధర్మంబు బాగజెప్పగవచ్చు
తామదీవలగొట్టి తరుమవచ్చు
శాస్త్రపద్ధతులంత చదివిచెప్పగవచ్చు
తానుసుగుణములేక తప్పవచ్చు
గురుపుత్రులంటుచు కులుకుచుండగవచ్చు
జారచోరములెల్ల జరుపవచ్చు

తే॥ మాటలెప్పుడుకపటంబు మాన్పలేవు
చదువులెప్పుడుగుణముల చంపలేవు
పకరికోరకేయు వేషంబువలదనంగ
ఆత్మసమ్మితి నారాయణార్యవిన్న॥ 103

సీ॥ మే మధికమంచును మిట్టిపడు టేలను
మరణంబు లేకుండ మానగలరె
మే మధికమంచును మిట్టిపడు టేలను
మలమూత్రములు రాక మానగలరె
మే మధికమంచును మిట్టిపడు టేలను
మాంసదేహము వేరు మార్చగలరె
మే మధికమంచును మిట్టిపడు టేలను
యింద్రియవ్యాపార మీడగలరె

తే॥ జననమరణంబులును సర్వ జనులకొక టె
అగ్ని నీరును పృధివికి అంటు లేక
నరులకంటన సాధులు నగుదురనగ
ఆత్మసమ్మితి నారాయ ణార్యనిన్ను॥ 104

సీ॥ మేలుకొను మో జీవ మేలుకొను మో జీవ
చూపు తక్కువగాక చూడునపుడె
మేలుకొను మో జీవ మేలుకొను మో జీవ
కరచరణములు పుష్టి గలుగునాడె
మేలుకొను మో జీవ మేలుకొను మో జీవ
చెవులకు శబ్దంబు చేరునాడె
మేలుకొను మో జీవ మేలుకొను మో జీవ
తెరుపు మరుపులు లేక తిరుగునాడె

తే॥ వూతకఱ్ఱయు చేపట్టు కుండునాడె
కుక్కిమంచంబులో చేర కుండునాడె
మేలుకొను వాడు జగమున మేటియనగ
ఆత్మసమ్మితి నారాయ ణార్యనిన్ను॥ 105

సీ॥ లాలిపాడవెచెప్య లాలిపాడవేజీవ
లాలినారాయణా లాలియంచు
లాలిభక్తులపాల లాలిరత్నముమాల
లాలినారాయణా లాలియంచు
లాలివరములదొరవు లాలిగురువులగురువు
లాలినారాయణా లాలియంచు
లాలిముక్తికిదాత లాలియుక్తికిదాత
లాలినారాయణా లాలియంచు
తే॥ లాలియోపరమానంద లాలిలాలి
లాలిపరిపూర్ణ గుణనిధి లాలిలాలి
అనెడిపుణ్యులుమోక్షాని కర్హులనగ
ఆత్మనమ్మితి నారాయ ణార్యనిన్ను॥
సీ॥ అజ్ఞానమునుబాపి ఆనందమొసగెడి 106
గురుస్వాములారతి కొనుడుకొనుడు
జీవభావముబాపి చెలగిబ్రహ్మముజూపు
గురుస్వాములారతి కొనుడుకొనుడు
వూర్ధ్వలోకంబు వుపముదెల్పెడిస్వామి
గురుస్వాములారతి కొనుడుకొనుడు
జన్మరహితముగల్గ జాడదెలిపెడిదేవ
గురుస్వాములారతి కొనుడుకొనుడు
తే। కొనుడువోస్వామిహారతి కొనుడుకొనుడు
పచ్చకర్పూరమనుమాయ ప్రజ్ఞయనెడి
పళ్లెరమునందుహారతి పట్టుమనగ
ఆత్మనమ్మితి నారాయ ణార్యనిన్ను॥ 107

సీ॥ పెనుమల్లివంశంబు మునిపాలగోత్రంబు
పంటకులంబున పరగఘనులు
రమణసుబ్బారెడ్డి రామాంబకును నేను
ఆత్మజుడసూర యాఖ్యుడగుచు
నారాయణార్యనీపేర నీశతకంబు
గావించితినిగాని కవినిగాదు
గురువుచెప్పినమాట మరలచెప్పితిగాని
గొప్పమెప్పులుగోరి చెప్పలేదు
తే॥ వాదభేదంబు క్రోధంబు వదలువరకు
నేను నీవను తత్వంబు నిలుచువరకు
దేవ యీ శతకమున్నీవు గావుమనుచు
ఆత్మసమ్మతి నారాయణార్యవిన్న॥ 108



నారాయణార్య శతకము-
సంపూర్ణము



సింహపురి ముద్రాక్షరశాల. నెల్లూరు.

అపూర్వానుభవ సిద్ధముగ తయారుగాబడిన,

# నయనచంద్రోదయము.

ఇది అమూల్యము:—నేత్రములయందలి పొరలు పువ్వులు, తిమిరము, నవీన కాచరోగములు, దూరదృష్టి లేక సన్నని వస్తువులు గనబడకుండుట, పొగవలె మంచువలె గనబడుట, మంటలు, నీరుగారుట, పుసులు గట్టుట, పిటకములు, రేచీకటి, కంటిలోపుండగుట, నొప్పులు గలుగుట, గరగరలాడుట, రెప్పలు మందముగ నుండుట, రెప్పలవాపు, రెప్పలపుండ్లు, రెప్పల వెంట్రుకలు రాలుట, దుర్మాంసములు, నంజులు, దురదలు, దివ్వె సూర్యకాంతి చూడనివ్వక మెరుపువర్ణముగలిగి చీకిరించుకొని యుండుట మున్నగు నేత్రరోగముల నన్నిటిని నిస్సందేహముగ తొలగద్రోలి స్వభావదృష్టి నింపుగ నిచ్చుటయేగాక అభివృద్ధిపరచును.

ఏలాటి నేత్రరోగములు లేనివారు సైతమీ యంజనమును సకృతుగా వాడుచునచ్చిన పూర్ణదృష్టి నిచ్చి యేలాటి వ్యాధులనన్నిటికి రాకుండజేయును.

ఒకతులము సీసా వెల రు 4—0—0 [illegible]

(అరతులము [illegible]—0—0) కాలుతులము రు 1—0—0

నేత్రరోగ లక్షణములను వివరముగా వ్రాయించి పంపిరేని అందుకు యుపయోగమగు యౌషధములను అయ్యే ఖరీదేవేసి వి. పి. గా పంపబడును.

వి. రాఘవేంద్రశాస్త్రి,

[illegible]